విశ్వసాహిత్యమాల



# రాజ్యాంగయంత్రము

వి. ఐ. లెనిన్.

అనువాదకులు:

మహీధర జగన్మోహనరావు.

ఫిబ్రవరి 1939

విశ్వసాహిత్యమాల

ముంగండ,

(Via) అంబాజీపేట, తూర్పుగోదావరి.

# 1919 జూన్ 11 వ తేదీని, స్ట్వర్ ష్లోవ్ యూనివర్సిటీ విద్యార్థుల కిచ్చిన ఉపన్యాసము.

యు. యన్. ప్రింటింగువర్క్సు, నత్రారామేశ్వరము.

వెల రు ౦—౨—౦

# ఇది ముందు చదవండి.

'రాజ్యాంగయంత్రం'— 'ప్రభుత్వం' యింకా యిట్లాంటి మాటలూ ఎన్నో వున్నాయి. వీటన్నిటివలనా వ్యక్తమయేది ఒకే భావమూ? ఏమైనా తేడాలు వున్నాయా? ఇది మంచి ప్రశ్నే. తెలుగులో శాస్త్రీయ గ్రంథాలు, యే విజ్ఞాన శాఖలోనైనా సరే, చాలా తక్కువగా వుండడంవల్ల మనం ఆ యా పదాల్లోని సూక్ష్మ భేదాన్ని కనిపెట్టి ఉపయోగించడానికి అలవాటు పడలేదు. ఇంగ్లీషులో సూక్ష్మమైన భావభేదం వున్నపుడు వేరు వేరు మాటల్ని రూఢిగా వుపయోగించడం మనం చూస్తాము. శాస్త్రీయ గ్రంథాలు వ్రాయాలన్నా, శాస్త్రీయ పద్ధతులపై ఆలోచన సాగించాలన్నా, మనం ఉపయోగించే మాటల్ని సరిగా తూచివేయవలసి వుంటుంది. అనువాదాల విషయంలో యీ విషయాన్ని మనం ముఖ్యంగా గమనించి తీరాలి.

## ఎందువల్ల?—

మార్క్సు, ఏంగిల్సు, లెనిన్, మొదలైన వాళ్ళ గ్రంథాలు ఏదో ఉబుసుపోకకు చదువవలసినవి గావు. వాటిలో ప్రతీవాక్యమూ, ప్రతి మాటా ఎంతో గంభీరమైన భావాల్ని వ్యక్తపరుస్తూ, ఒక్కొక్క నిర్దిష్టమైన అర్థంలో

వాడబడి వుంటాయి. ఒక్క వుదాహరణ చూడండి. State కూ Government కూ ఎంతో భేదం వుంది. కాని, తెలుగులో రెండు మాటలకూ ఒకే పర్యాయ పదాన్ని వుపయోగించుతూంటారు, మనవాళ్లు చాలామంది. ఆ భేదం ఏమిటి? Government అంటే State యొక్క అంగాల్లో ఒకటి మాత్రమే నని చెపుతే ఆశ్చర్యంగా వుందా? అయినా కాని తప్పదు. శాస్త్రీయంగా రాజకీయ శాస్త్రాన్ని పఠించా లని అనుకునేవాళ్లు యిట్లాంటి వాటిని స్వల్పవిషయాలని త్రోసి పారేయడానికి వీలు లేదు.

లెనిన్ మహాశయుని ఉపన్యాసాన్ని చక్కగా తేట తెల్లంగానూ, శాస్త్రీయంగానూ కూడా అనువదించి, సఫలు డైనాడు, అనువాదకుడు. ఈ గ్రంథాన్ని చదివితేనే 'రాజ్యాంగయంత్రాన్ని' గూర్చిన సిద్ధాంత గ్రంథాల్ని సులభంగా అర్థం చేసుకో గలుగుతాము. పుస్తకం చివర నిచ్చిన పర్యాయ పదసూచిక పాఠకుల కెంతో ఉపయుక్తంగా వుంటుంది.

త్వరలోనే 'రాజ్యాంగయంత్రం- విప్లవం' అనే సిద్ధాంత గ్రంథం కూడా ప్రకటిస్తాము. ఆంధ్రమహాశయులీ గ్రంథాలవలని ఉపయోగం పొందడంలో వెనుకబడరని తలుస్తాము.

ముంగండ. సంపాదకుడు.

# రాజ్యాంగయంత్రం.

కా ప్రేమ్ డ్స్,

ఈ రోజున రాజ్యాంగయంత్రాన్ని గూర్చి వుపన్యసించమని మీరు కోరినప్పుడు నేనూ అంగీకరించేను. మీకు యీ విషయంలో యెంత పరిజ్ఞానం వున్నదీ నాకు తెలియదు. కాని, మీ తరగతులిప్పుడే ప్రారంభమైనాయని తెలుసుకున్నాను. ఇటువంటి క్లిష్టతర విషయాన్ని అర్థం చేసుకొనేందుకు, మీకిదే ప్రధమ ప్రయత్నం అనుకుంటా. అందుచేతనే, మీ కందరకూ స్పష్టంగా తెలిసేటట్లు యీ క్లిష్ట విషయాన్ని చెప్పలేనేమోయని సందేహిస్తూన్నాను. మొదటి పర్యాయంలోనే మీకు దీన్ని గూర్చి అంతగా తెలియక పోయినా మీరు కంగారు పడనక్కర లేదు. బూర్జువాగ్రంధకర్తలూ, ప్రొఫెసర్లూ, తత్వవేత్తలూ, వీళ్లందరూ యీ రాజ్యాంగయంత్రసమస్యను క్లిష్టాతిక్లిష్టం చేసి పారేసేరు. దీనిలో అనేక చిక్కులు తెచ్చిపెట్టేరు. అందుచేత మీరు ఏదో ఒక్క ఉపన్యాసంతోటే యీ విషయాన్ని పూర్తిగా గ్రహించలేక పోయినారంటే ఆశ్చర్యం లేదు. నేను చెప్పే విషయాల్ని శ్రద్ధగా విని, మీకు తెలియని సందర్భాల్ని, అస్పష్టంగావున్న సమస్యల్ని గుర్తుగా

వ్రాసుకొని, తిరిగి తిరిగి వాటిని గూర్చి చర్చలూ, సంభాషణలూ, పాఠాలూ జరిపి, స్పష్టంచేసుకొనేటందుకు ప్రయత్నించాలి.

మనం మళ్లీ యింకోసారి కలుసు కొంటామనుకుంటా. అప్పుడు దీనికి సంబంధించిన మరి కొన్ని విషయాల్ని, మీకు తెలియని సందర్భాల్ని గూర్చి చెప్పగలను. ఉపన్యాసాలు వినడం, చర్చల్లో పాల్గొనడం మాత్రమే గాక, మీరు మార్క్సు, ఏంగిల్సుల గ్రంథాలు కూడా శ్రద్ధగా చదవాలి. మీ పాఠ్య గ్రంథాల్లోనూ, వాఙ్మయ సూచికలోనూ కూడా యీ పుస్తకాల్ని గురించిన వివరాలు లభిస్తాయి. పాఠశాలలకీ, సోవియట్ లకీ అనుబంధాలుగా వున్న లైబ్రరీలలో మీకీ పుస్తకాలన్నీ దొరుకుతాయి. కాని, యీసందర్భంలో నేను చెప్పినమాటలు మరువకూడదు. బూర్జువా తత్వవేత్తలూ, గ్రంథకారులూ కూడా కలియ త్రొక్కి కంగారుచేసిన యీసమస్యనుగూర్చి తెలుసుకోడానికి మీరు ఒక్కసారి ప్రయత్నిస్తే చాలదు. పట్టుదలతోటీ, అభినివేశంతోటీ యీ విషయాన్ని పఠించాలి. వివిధ దృక్పథాల నుంచి ప్రతి సమస్యనూ అవలోకించాలి. ఒకసారి చదివితే తెలియని విషయాలు రెండోసారి చదివితే తెలుస్తాయి. ఒకసారి మీ దృష్టిపథంలో పడని సూక్ష్మ విషయాలు మరోసారి చదివేటప్పుడు గోచరిస్తాయి. వీటిని పూర్తిగా అవగా

హన చేసుకొనేటందుకు మీరు స్వతంత్రంగా, వివిధముఖాల నుంచి యీ సమస్యల నెదుర్కొని, విడదీయవలసి వుంటుంది.

రాజ్యాంగయంత్రాన్ని గూర్చిన సమస్యకు మీరు తిరిగితిరిగి అనేకసార్లు రావలసి వస్తూంటుంది. రాజకీయాల్ని గూర్చి పఠించేటప్పుడు యిదే అన్ని యితర సమస్యలకూ మూలాధారమైనది. విప్లవం జరుగుతూన్న యీ రోజుల్లోనే గాక శాంతి వాతావరణ పూరితమైన వనుకొనే రోజుల్లో కూడా ఏ పత్రికలో నైనాసరే, యే రాజకీయ, ఆర్థిక విషయాన్ని గూర్చి వ్రాసేటప్పుడైనా యీ రాజ్యాంగయంత్రాన్ని గూర్చిన ప్రశ్న మళ్లీమళ్లీ వచ్చి తీరుతూంటుంది. రాజ్యాంగయంత్రం అంటే ఏమిటి? దాని పర్యవసానం ఏమిటి? దాని ప్రాముఖ్యత ఎందులో వుంది? పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేయ యత్నిస్తూన్న మన కమ్యూనిష్టు పార్టీయొక్క దృక్పథం, రాజ్యాంగయంత్రం పట్ల ఎట్లా వుంటుంది? ఇట్లాంటి అనేక ప్రశ్నలు మీకు ప్రతినిత్యమూ ఏదో ఒక కారణంవల్ల తటస్థించుతూనే వుంటాయి. పుస్తకాల్లోనూ, చర్చల్లోనూ, ఉపన్యాసాల్లోనూ కూడా దీనిని గూర్చి నేర్చుకుంటూ, మన ప్రతిద్వంద్వులతో తటస్థించే వాదవివాదాల్లో, ఎన్నో చిక్కుసమస్యల్ని విడదీయవలసిన ప్పుడల్లా యీ విషయాన్ని స్వయంగా యెదుర్కొని, పరి

ష్కరించవలసి వస్తూంటుంది. ఈ సమస్యల్ని స్వతంత్రంగా ఎదుర్కొని, పరిష్కరించే మార్గాన్ని మీరు గ్రహించినట్లైతేనే, మీరు మీ సిద్ధాంతాన్ని ఏ సందర్భంలోనూ, ఎవరితోనైనా వాదించి నిలువుకో గలుగుతారు. అప్పుడే మీ అభిప్రాయాలు ఒక స్థిరరూపాన్ని ధరించేయని చెప్ప వచ్చును.

ఇంతటితో నా ఉపోద్ఘాతాన్ని చాలించి అసలు విషయానికి వస్తాను. రాజ్యాంగయంత్రం అంటే ఏమిటి? అది ఎప్పుడు, ఏవిధంగా, బయలుదేరి, బలపడింది? పెట్టుబడిదారీ విధానాన్ని సంపూర్ణంగా నాశనం చేసేటందుకై పోరాడుతూన్న మన పార్టీ యొక్క, కార్మికవర్గ పక్షమైన కమ్యూనిస్టు పార్టీయొక్క వైఖరి రాజ్యాంగయంత్రం పట్ల ఎట్లా వుండాలి?

బూర్జువా శాస్త్రజ్ఞులు, తత్త్వవేత్తలు, ధర్మశాస్త్రజ్ఞులు, ఆర్థికనిపుణులు, పత్రికా రచయితలు, వీళ్ళంతా కూడా రాజ్యాంగయంత్రం సమస్యను బుద్ధిపూర్వకంగానూ, తెలియకనూ కూడా, కలియదొక్కి గత్తరచేసి విడిచి పెట్టేరని మీతో యిదివరకే చెప్పేను. మతప్రచారకులే గాక (వీళ్లిట్లా చేయడంలో ఆశ్చర్యంలేదు!) మత విశ్వాసాలేమీ లేవని బడాయి కొట్టేవాళ్లు కూడా ఈ రోజువరకూ, ఈ ప్రశ్నను మత సమస్యలతో కలిపి కంగారుపెడుతూన్నారు.

వీళ్లందరూ డొంక తిరుగుడుగా ఆదర్శవాద పద్ధతి మీద వాదిస్తూ, రాజ్యాంగయంత్రం మానవాతీతమైన దనీ, మానవ జీవితాన్ని నడుపుతూన్న శక్తి రూపమనీ, ఎక్కడినుంచో పరమ పవిత్రమైన మహత్తర శక్తిని తనద్వారా ప్రజలకు అంద జేస్తూందనీ, అట్టి మహాశక్తిని ఒక్క రాజ్యాంగయంత్రమే యివ్వగలదనీ, యిస్తూందనీ చెపుతూంటారు. ఇట్లాంటప్పుడు మనం ఒక్క విషయాన్ని గమనించాలి. వీళ్లందరి బోధ నలూ దోపిడి చేసే వర్గాల యొక్క ప్రయోజనాలతో యెంత వరకూ అనుబంధించబడి వుంటూన్నాయో, పెట్టు బడిదార్ల యొక్క, భూస్వాముల యొక్క లాభాలకై యెల్లా వుపయోగిస్తూన్నాయో, చూడాలి. బూర్జువా శాస్త్రవేత్తల విజ్ఞానంలోనూ, దృక్పథంలోనూ, అలవాట్ల లోనూ కూడా అడుగడుక్కీ మనం యీ సంబంధాన్నే కనిపెట్ట గలము. చివరకి, మెన్షివిక్కులు, సోషలిస్టు రివల్యూ షనరీలూ కూడా తమ కెంతమాత్రమూ మత విశ్వాసం లేదనీ, రాజ్యాంగయంత్రాన్ని గూర్చి సరియైన దృక్పథం కలిగి యుండడానికి తమకు సమస్తావకాశాలూ వున్నాయనీ బడాయి కొట్టుకుంటూన్నా, వాళ్ళల్లో కూడా యీ బూర్జువా వాసనలు కనిపిస్తూన్నాయి.

పాలకవర్గాలయొక్క ప్రయోజనాలతో సన్నిహిత సంబంధం కలది గనక యీ రాజ్యాంగయంత్ర సమస్య

ఎంతో క్లిష్టతరంగా వుంచబడింది. (ఒక్క ఆర్థిక శాస్త్ర బోధనలు మినహాగా) రాజ్యాంగ యంత్రాన్ని గూర్చిన బూర్జువా బోధనలన్నీ ప్రస్తుత సమాజంలో వుండే ప్రత్యేక హక్కు సౌకర్యాల్ని సమర్థిస్తూన్నాయి. అంతేగాక పెట్టుబడిదారీ విధానం యొక్క ఉనికినే సమర్థిస్తూన్నాయి. అందుచేతనే నిష్పక్షపాతంగా యీ సమస్యల్ని గూర్చి చెప్పాలనడం పొరబాటు. రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి శాస్త్రముల్లో యేమున్నదీ శాస్త్రజ్ఞులు తెలుపుతారనుకోవడం తెలివితక్కువ. దాన్ని గురించిన సిద్ధాంతాల్లోనూ, బోధనల్లోనూ పరిచయాన్ని పొంది, స్వతంత్రంగా మీరే ఆలోచించి చూడగలిగినప్పుడే రాజ్యాంగయంత్రంయొక్క ప్రాముఖ్యతను గూర్చి, దాని చర్యను గూర్చి వివిధ పక్షాలవాళ్ళు యెల్లా పోట్లాడుకుంటూన్నారో, వివిధవర్గాల మధ్యనున్న స్పర్థలు ఆయా అభిప్రాయాలద్వారా యెట్లు విస్పష్ట మవుతూన్నాయో మీకు తెలుస్తుంది.

రాజ్యాంగయంత్ర సమస్యను శాస్త్రీయదృష్టితో సమీపించదలచిన మనము ముందుగా అది యెట్లా బయలుదేరి అభివృద్ధి చెందినదీ క్లుప్తంగానైనా తెలుసుకోవడం చాలా అవసరం. సామాజికశాస్త్రంలో యిదే మిక్కిలి ముఖ్యమైనది. ఏదైన ప్రధాన సమస్యను సరియైన దృక్పథాన్నుంచి చూడడం అలవర్చుకోడానికీ; అప్రాముఖ్య

ములూ, పరస్పర విరుద్ధములూ అయిన అనేకాభిప్రాయాల్లో చిక్కుకొని, దారి తప్పకుండుటకూ; అట్టి సమస్యకు మూలాధారమైన చారిత్రక సందర్భాన్ని మరిచిపోకుండుటకూ యిట్టి శాస్త్రీయదృష్టీ, పరిజ్ఞానమూ అవసరం; అంతేగాదు, వాంఛించదగినది కూడాను. చరిత్రలో నిర్దిష్టమైన ఒక దృశ్య విషయం (చారిత్రరూపం) ఎట్లా బయలుదేరినదో, దాని అభివృద్ధి క్రమములోని ముఖ్యదశలేవో, ఆయాదశలు గడచి అదెట్లా ముందుకు బోయినదో, అది ప్రస్తుతంలో యెట్లున్నదో, తెలుసుకోడానికి ఆ నిర్దిష్టవిషయం (Phemo-menon) యొక్క 'గతి' ని మనం యిట్టి విమర్శనా దృష్టితో చూడాలి.

ఏంగిల్సు వ్రాసిన Origin of Family, Private Property and State అనే గ్రంథాన్ని మీరు తప్పకుండా యీ సందర్భంలో చదివితీరాలి. ఇటీవలి కాలంలో 'సోష లిజమ్' మనకు ప్రసాదించిన ముఖ్యగ్రంథాల్లో యిదొకటి. గ్రంథకర్త దీనిలోని ప్రతీవాక్యాన్నీ, ప్రతిమాటనీ కూడా సరిగ్గా తూచివేసేడు. ప్రతివాక్యంలోనూ ఎంతో అర్థవంత మైన చారిత్రక, రాజకీయ విషయాలు గర్భీకృతంగా వున్నాయి. ఈ పుస్తకం అంతగా సుబోధకం గాని మాట నిజమే. కొంతవరకైనా ఆర్థిక, చారిత్రకవిషయ పరిజ్ఞానం వున్నవాళ్ళకేగాని తెలియనట్టి ఘట్టాలు దానిలో యెన్నో

వున్నాయి. కాని యింతమాత్రంచేత మీరు కంగారు పడ నక్కరలేదు. ఎవ్వరూకూడా దాని నొక్కసారి చదివే టప్పటికే అర్థం చేసుకోలేరు. మీకు ఆసక్తి కలిగినపుడల్లా తిరిగి తిరిగి దాన్ని చదువుతూంటే ఎన్నెన్నో నూతన విషయాలు విశదం అవుతూంటాయి. రాజ్యాంగ యంత్రాన్ని గూర్చి చక్కని పరిజ్ఞానాన్ని యిస్తుంది కనుకనే యీపుస్త కాన్ని గురించి యింతగా చెప్పవలసి వచ్చింది. అసలు రాజ్యాంగయంత్రం అనేది ఎట్లా బయలు దేరింది? అను దాన్ని గురించి యిది వివరిస్తుంది.

పెట్టుబడిదారీ విధానం, అంటే మానవుడు మానవుని దోచుకొనే పద్ధతి, యెట్లా పుట్టింది? సోషలిజం ఎట్లా బయలు దేరింది? సోషలిజమ్ బయలుదేరడానికి ఏయే పరిస్థితులు కారణభూతాలైనాయి? ఇట్లాంటి సమస్యల నన్నిటినీ చారిత్రకదృష్ట్యా చూస్తే వాటి అభివృద్ధి క్రమాన్ని సులభంగా అర్థం చేసుకోవచ్చు. రాజ్యాంగయంత్రం అనేది ఒకానొక కాలంలో వుండేది కాదనే విషయం ముఖ్యంగా మీరు యెప్పుడూ జ్ఞాపకం వుంచుకోవాలి. (అంటే రాజ్యాంగ యంత్రం లేని కాలం ఒకటి వుండేది.) మానవసమాజంలో వర్గ భేదాలు జనించినప్పుడే, దోపిడి చేసేవాళ్లు, దోపిడి చేయ బడేవాళ్లు, అనే రెండు తరహాలుగా మానవులు చీలిపోయి నప్పుడే, ఆ సమాజంలోనే రాజ్యాంగయంత్ర మనేది కూడా

జనించింది.

మానవుడు మరొక మానవుని దోపిడీ చేసే విధానమే వర్గసమాజానికి పునాది. బానిస సమాజమే మొట్టమొదటి వర్గ సమాజరూపము. సమాజమంతా బానిసలూ, బానిస యజమానులూ, అని రెండు వర్గాలుగా చీల్చబడుటకు పూర్వం పైతృక కుటుంబపద్ధతి లేక ఆనువంశిక కుటుంబ పద్ధతి (అంటే తర తరములు వరకూ బంధుత్వమువల్లనే మానవులు గుంపులుగా జీవితయాత్ర గడపుకాలము) అమలులో వుండేది. నేటికీ నాగరకత వ్యాపించని భూభాగాల్లోని కొన్ని తెగల్లో, కొంతవరకిట్టి సమాజ విధానాన్ని చూడగలము. ఆదిమ మానవ విజ్ఞానాన్ని గూర్చిన యేగ్రంథంలో నైనా సరే వర్గరహిత సమాజంయొక్క '(ఆదిమ కమ్యూనిస్టు సమాజాన్ని బోలినది) వర్ణనలూ, కథలూ, స్మృతి చిహ్నాలూ మనకు కనిపించుతాయి. ఆకాలంలో బానిసలూ లేరు, బానిసప్రభువులూ లేరు; అప్పటికి రాజ్యాంగయంత్రం అనేది పుట్టనేలేదు. ప్రజాసమూహాలను దౌర్జన్యానికి పాల్జేస్తూ, దౌర్జన్యాన్ని ప్రయోగించే టందుకొక ప్రత్యేక సాధనా విధానాన్ని కల్పించుకొన్నదే లేదు. ఈ ప్రత్యేక సాధనా విధానాన్నే మనం 'రాజ్యాంగయంత్ర' మని పిలుస్తాము.

ప్రజలందరూ చిన్న చిన్న సమిష్టి కుటుంబాలుగా

నివసిస్తూండే కడిమ సమాజంలో, నేటి నాగరక సమాజ శకానికి కొన్నివేల సంవత్సరాల క్రిందట, రాజ్యాంగయంత్ర మనేది మందుకైనా వుండేదిగాదు. అప్పట్లో ప్రజలస్థితి ఆటవికుల స్థితికి సమీపంలో వుంటూ, సమాజాభివృద్ధి ప్రథమ దశలోనే వుండేది. సమాజంలో మానవ జీవిత యాత్ర కేవలమూ అలవాట్లవల్లా, కులపెద్దయొక్క అధి కారశక్తులవల్లా, అతనియందితరులకుండే గౌరవభావంవల్లా జరిగిపోతూండేది. ఆ రోజుల్లో యిల్లాంటి అధికార గౌరవా లకు స్త్రీలుకూడా స్థానమై వుండేవాళ్లు. ఇప్పటికీ పలె స్త్రీలు యేలాటి హక్కులూ లేక అణిచిపెట్టబడి యుండే వాళ్లుగారు. ప్రజాబాహుళ్యాన్ని పరిపాలించడానికి ఒక ప్రత్యేక వర్గాన్ని వేరుచేసి వుంచడము ఎక్కడా లేనేలేదు, ఆకాలంలో. నేడు, యీ ప్రత్యేక పాలకవర్గమే, పాలనా కార్య నిర్వహణం కోసం శిక్షణాయుతమైన నిర్బంధ సాధన సంపత్తిని, దౌర్జన్య పరికరాల్ని శాశ్వతంగా నడుపు తూన్నారు. ప్రస్తుత ప్రభుత్వాల్లో సాయుధపటాలాలు, జైళ్ళు, పోలీసులు, యింకా యితరుల్ని దౌర్జన్య ప్రయోగం చేత లోబరచు కొనేటందుకు అనేక సాధనాలూ, మనం చూస్తూనేవున్నాము. 'రాజ్యాంగయంత్రం' అంటే కడపటి సారాంశం, యీ ప్రజా పీడనా సాధన సంపత్తియే !

మానవ సమాజంకంటె పరిపాలనా యంత్రం భిన్న

మైనదని చెప్పడానికి ' రాజ్యాంగయంత్ర ' మనేది విషయని, మత ప్రచారకులు, తత్త్వవేత్తలు, బూర్జువా శాస్త్రజ్ఞులు చెప్పే సిద్ధాంతాల్నీ, బోధనల్నీ విడమర్చి, విమర్శించి చూస్తే తేలుతూంది. కేవలం పరిపాలనా కార్యాలందే నిమగ్నులై వుండే కొందరు వ్యక్తులు బయలుదేరి నప్పుడే, ప్రజల్లో కొందరి యిష్టానిష్టాల్ని కార్జన్యంగా, బలవంతంగా అణిచి పెట్టేటందుకు ఒక ప్రత్యేక సాధనతతిని ఏర్పాటు చేసు కొన్నప్పుడే, అంటే జైళ్ళు, సైన్యాలు, పోలీసులు మొద లైన కార్జన్య సాధనాలు అవసరమైనపుడే ' రాజ్యాంగ యంత్ర ' మనే దాన్ని చరిత్రలో మనం చూస్తాము.

కాని, రాజ్యాంగ యంత్రమే లేని కాలం ఒకటుండే దన్ని మీకు మళ్లీ జ్ఞాపకం చేస్తున్నాను. మానవుల్లో సాధా రణ సంబంధాలన్నీ, క్రమశిక్షణా, నియమిత కార్యాలూ అన్నీ కూడా, ఇంతెందుకు, సమాజమంతా క్రమానుగతంగా వస్తూన్న ఆచారములు, అలవాట్లు మూలంగానూ, నాయ కత్వం వహించి అందరి భక్తి విశ్వాసాలకూ పాత్రుడైన కుల పెద్ద యొక్క అధికారానికి లోబడీ జరిగిపోతూండేవి. పురుషులతో సమాన ప్రతిపత్తు గలిగి, వాళ్ళకంటేనూ అధిక గౌరవాస్పదులైన స్త్రీలు కూడా కులపెద్దలుగా వుండి కార్య నిర్వహణం చేయడం వుండేది. అంతేగాని, ప్రత్యేక పరి పాలనా కార్యదక్షులు, పాలకవర్గం, అనేది అప్పట్లో

వుండేదేకాదు. ఎప్పుడు మానవ సమాజం రెండువర్గాలుగా చీలిపోయిందో, అంటె ఒక మానవుని శరీరకష్టాన్ని యింకొకడు దోచుకోడానికి అవకాశం కలిగిందో అప్పుడే, ఆ సమాజం లోనే 'రాజ్యాంగయంత్రం' పీడితుల నణచియుంచడానికై బయలు దేరిందని చరిత్ర ఋజువు చేస్తోంది.

సమాజం రెండు వర్గాలుగా చీలడం అనేదాన్నే మనం చరిత్రలో ముఖ్యంగా జ్ఞాపకం వుంచుకోవాలి. సమాజాభివృద్ధి యొక్క యాథార్థ్యాన్నీ, సంగతత్వాన్నీ, సాధారణ నియమాల్నీ, ప్రపంచమంతటా వేలకొలది సంవత్సరాలుగా మానవ సమాజం యొక్క పరిణామమే ఋజువు చేస్తోంది. ప్రారంభంలో వర్గభేదాలూ, నిరంకుశ ప్రభువులూ లేని పైతృక సమాజం వుండేది. తరువాత బానిసత్వంపై, ఆధారపడిన సమాజవిధానం వచ్చింది. నేటి యూరోపియన్ సమాజమంతా యీ దశను దాటివచ్చినదే. రెండువేల సంవత్సరాల క్రిందట యూరోపు నందంతటా బానిసత్వమే వ్యాపించియుండేది. ప్రపంచంలోని మిగిలిన దేశాలన్నీ చాలవరకీ దశను అతిక్రమించి వచ్చినవే. నాగరక జాతుల్లో కూడా బానిసత్వ విధానం యొక్క జాడలు నేటికీ కనిపిస్తూనే వుంటాయి. ఆఫ్రికాలో బానిసత్వం నేడు మనం స్పష్టంగా చూడగలము. బానిసలు, బానిసప్రభువులు యిదే మొట్టమొదటి వర్గ విభాగము. ప్రాథమిక దశలోవున్న ఉత్పత్తి

పరికరాలు, భూమి, ఇవే గాకుండా ప్రజలు కూడా బానిస ప్రభువుల స్వంతమై వుండేవాళ్ళు. కష్టించి, యితరులకై పని చేసే ప్రజలందరూ బానిసలుగా వ్యవహరించ బడుతూండే వాళ్ళు.

చరిత్రలో దీని తరువాతి పరిణామం 'దాసత్వ విధానం'. చాల దేశాల్లో బానిసత్వ పద్ధతే దాసత్వ పద్ధతిగా మార్పు జెందింది. ఇందులో జమీందారీ భూస్వామి, దాసులు, యివే సమాజంలోని ముఖ్య వర్గాలు. సమాజ విధానంతోబాటు ప్రజల మధ్య పరస్పర సంబంధాలు కూడా మార్పు జెందేయి. అంతవరకూ బానిస ప్రభువులు బానిసల్ని తమ ఆస్తిగా పరిగణించేవారు. చట్టాలు కూడా యీ పద్ధతినే బలపరచేవి. యజమానుల యితర ఆస్తులవంటి అచేతన పదార్థాలుగానే 'బానిసలు' కూడా చెలామణీ అవుతూండేవాళ్లు. కాని, దాసత్వ విధానంలో యీ పరిస్థితుల్లో కొద్ది మార్పు కలిగింది. వర్గపీడనా, పరాధీనతా, అట్లాగే వుండిపోయినాయి. భూస్వామి రైతుల్ని తన స్వంత ఆస్తిగా చూసేటందుకు వీల్లేకపోయింది. రైతుచేత 'వెట్టి' చేయించుకొనే హక్కూ, యింకా కొన్ని విధులు నిర్వర్తించేలా నిర్బంధించగల హక్కూ మాత్రం మిగిలినవి. యథార్థానికి బానిసత్వానికీ, దాసత్వానికీ భేదం గుర్తించ జాలనంత స్వల్పంగా మాత్రమే కనపడుతుంది. దాసత్వ పద్ధతి

అమానుష రూపాల్ని దాల్చి, చిరకాలం తాండవించిన రష్యా మొదలైన దేశాల్లో యీభేదం మరీ స్వల్పంగా వుంటుంది.

ఇంతే గాదు. జమీందారీ యుగంలో వర్తక వ్యాపారాలభివృద్ధి జెందుతూ, ప్రపంచమంతటా 'మార్కెట్లు' ఏర్పడినాయి. మారక సౌకర్యంకోసం 'ధనం' అధికాధికంగా చెలామణీలోకి రావడంతో సమాజంలో మరొక నూతన వర్గానికి, పెట్టుబడిదారీ వర్గానికి అంకురార్పణ అయింది. వర్తకపు సరకులు, వర్తకపుసరకుల మారకం, అందులో ధనంయొక్క ప్రాముఖ్యత, వీటితోబాటు 'పెట్టుబడి' అనేది కూడా అభివృద్ధి చెందుతూ వచ్చింది. పధ్ధెనిమిదో శతాబ్దపు చివర భాగంలోనూ, పందొమ్మిదో శతాబ్దంలోనూ ప్రపంచమంతటా విప్లవాలు చెలరేగినాయి. పశ్చిమ యూరోపునందంతటా జమీందారీ విధానం తుడిచి వేయబడింది. యూరోపులోని యితర దేశాలన్నిటిలో కంటెనూ ఆలస్యంగా, అంటే 1861 లో జరిగిన విప్లవ ఫలితంగా రష్యాలో కూడ జమీందారీ విధానం పోయి, పెట్టుబడిదారీ విధానం స్థాపించబడింది. ఈ నూతన విధానంలో కూడా వర్గభేదము లట్లే వుండిపోయినాయి. వెనుకటి జమీందారీ విధానంయొక్క శేషభాగాలు అచ్చటచ్చట మిగిలిపోయినా మొత్తంమీద వర్గవిభాగం నూతన మార్గాల్లో

సమువసాగింది.

సమాజంలో అత్యల్పసంఖ్యాకులు పెట్టుబడి, భూమి, ఫ్యాక్టరీలు, మిల్లులు మొదలైన వాటికి యజమానులై, అత్యధిక సంఖ్యాకుల 'శ్రమ శక్తి' ని తమ స్వాధీనంలో వుంచుకొంటారు. అంటే శ్రమ జీవులైన అధిక సంఖ్యాకుల్ని తమ చెప్పుచేతల్లో వుంచుకొని, వాళ్ళని దోపిడిచేస్తూ, పీడిస్తూ వుంటారు. ప్రజల్లో అధిక సంఖ్యాకులు శ్రామికులుగా కూలిపనివాళ్ళుగా (Wage labourers) వుంటూ, ఉత్పత్తి విధానంలోనే తమ శ్రమశక్తిని, రెక్కలకష్టాన్ని అమ్ముకొని, జీవిత యాత్రను వెళ్లబుచ్చుకొంటూంటారు. దాసత్వ కాలాన్నుంచీ పీడించబడుతూ, చితికిపోతూండే రైతుల్లో అధికసంఖ్యాకులు, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడంతో 'శ్రామికులు' గా తయారై పోతారు. వాళ్ళల్లో చాల కొద్దిమంది మాత్రమే పెద్ద రైతులై, కూలీలచేత పని చేయించుకొంటూ, పల్లెటూళ్ళల్లో బూర్జువాలుగా వుంటారు.

ఆదిమ సమాజాన్నుంచి భూస్వామ్య, దాసత్వ, పెట్టుబడిదారీ విధానాల్లోనికి పొందిన యీ మార్పునే మనం ముఖ్యంగా జ్ఞాపకం వుంచుకోవాలి. ఎందుకంటే, రాజకీయ బోధనల నన్నిటినీ యీ ఆధారంమీద చిత్రించుకున్నపుడే వాటిని మీరు సరిగా అర్థం చేసుకోగలుగుతారు; అప్పుడే

ఆయా బోధనలు యే యే వర్గానికి చెందివున్నాయో తెలుసుకోగలుగుతారు. సమాజ చరిత్రలో బానిసత్వ, జమీందారీ (దాసత్వ), పెట్టుబడిదారీ యుగాలన్నీ వందల కొలది శతాబ్దాలుగా వ్యాపించియుండి, అనేక రాజకీయ స్వరూపాల్ని, వివిధ రాజకీయ బోధనల్ని, అభిప్రాయాల్ని, విశ్వాసాల్ని తమలో యిముడ్చుకొని వున్నాయి. అతివిచిత్రమైన విరుద్ధ సిద్ధాంత పరంపరల్లో మీరు దారి కనుక్కోడం చాలా కష్టమైన పని, అందులోనూ బూర్జువా రాజకీయ వేత్తల బోధనలు మరీ కంగారుపెడతాయి. సమాజం వర్గాలుగా చీలుటయనే సంఘటనను దృష్టిలో నుంచుకొని, వర్గ పరిణామ రూపంలోని మార్పుల్ని, అన్ని యితర రాజకీయ, సామాజిక, ఆర్థిక సమస్యల్ని సులభంగా పరిష్కరించుకోగలుగుతారు.

ఈ ముఖ్య విషయాన్ని దృష్టిలో వుంచుకుని, రాజ్యాంగయంత్రాన్ని పరిశీలించినట్లైతే ఒక్క విషయాన్ని తెలుసుకోగలుగుతారు. నే నిదివరలో చెప్పిన రీతిగా, సమాజంలో వర్గభేదాలు లేనప్పుడు రాజ్యాంగయంత్రం కూడా వుండేదిగాదు. సమాజం వర్గములుగా విభజింపబడి, వర్గ విభేదాలు పరిస్ఫుటమూ, స్థిరమూ అవుతూన్నకొద్దీ, రాజ్యాంగయంత్రం కూడా బలపడుతూ, సుస్థిరం కాజొచ్చింది. పై మూడు దశల్ని గడచిన, గడుస్తూన్న

దేశాల్ని యెన్నింటినో మానవచరిత్రలో మనం చూస్తు న్నాము. ప్రతిదేశంలోనూ చరిత్రాత్మకమైన మార్పులెన్నో జరుగుతూన్నాయి; ప్రతిదేశం రాజకీయంగా అభివృద్ధి, పతనాలు పొందుతూనేవుంది; ఎన్నెన్నో విప్లవాలద్వారా మానవ సమాజం బానిసత్వ విధానంలోనుంచి జమీందారీ విధానంలోకీ, అందులోనుంచి పెట్టుబడిదారీ విధానంలోకీ, దానిలోంచి ప్రపంచ పరివ్యాప్తమైన ప్రస్తుత సోషలిస్టు పోరాటంలోకి పరిణామం పొందుతూనేవుంది; ఇన్నెన్ని మార్పులు జరుగుతూన్నా, వీట్లన్నిటిలోంచీ రాజ్యాంగ యంత్రోదయాన్నీ, అభివృద్ధినీ మనం స్పష్టంగా చూడగలము. సమాజంకంటె విభిన్నంగా కనిపిస్తూ, కేవలం పరిపాలనా కార్యాలలోనే నిమగ్నులై యుండే కొందరు ప్రత్యేక వ్యక్తులతో కూడివుండే అధికారయంత్రం మనకు కళ్ళకి కట్టి నట్లుగా కనిపిస్తూవుంటుంది.

ప్రజలందరూ క్రమ క్రమంగా పాలకులనీ, పాలితు లనీ, రెండు వర్గాలుగా విభజింప బడతారు. ఈ పాలక వర్గములు పాలనా కార్యాల్లో ప్రత్యేక శిక్షణను పొంది, సమాజానికి అతీతులై, రాజ్యాంగయంత్రానికి ప్రతినిధులుగా వుంటారు. పరిపాలన చేసే యీ వర్గమే ప్రజల్ని బలాత్కా రంగా అణిచి వుంచడానికి వీలైన పశుబల సాధనాల్ని యెల్లప్పుడూ తమ చేతుల్లో వుంచుకుంటారు. బానిస

యుగంనాటి గదలు, బాణాలు మొదలైన వాట్లలోగాని, మధ్యమ యుగాలనాటి తుపాకులు మొదలైన వాట్లలో గాని, నేటి యిరువదోశతాబ్దపు శాస్త్ర విజ్ఞాన ఫలితాలైన భయంకర మారణ సాధనాలలోగాని, మనం ఒక్కటే చూడగలం. ప్రతియుగంలోనూ, రాజ్యాంగయంత్రంతో యీ పశుబల ప్రయోగ సాధనాలు అవినాభావంగా వుంటూనే వున్నాయి; పశుబలాన్ని ప్రయోగించే విధానాల్లో మాత్రమే భేదం వుంది. ఎక్కడెక్కడ రాజ్యాంగయంత్రం కనిపిస్తూందో అక్కడల్లా సమాజంలో అధికారం చెలాయిస్తూ, ప్రాముఖ్యత వహించి పాలించుతూ వుండే కొందరు వ్యక్తులు వుంటూ వచ్చేరు. ప్రజలందరిమీదా తమ అధికారాన్ని సాగించుకోడం కోసం, యీ వర్గం తమ చేతుల్లో పశు బల సాధనాలు, భౌతిక, ఆయుధ పరికరాలు, వుంచుకుంటూనే వున్నారు. ఆయా యుగాల్లోని రాజ్యాంగ యంత్రాల ఆధీనం వుండే ఆయుధ సాధనాలు కూడా ఆయా కాలంనాటి శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధి ననుసరించే, మారుతూ వస్తూన్నాయి. దోపిడి చేయబడేవాళ్లు, దోపిడీ చేసేవాళ్లు, అనే రెండువర్గాలుగా సమాజం చీలినపుడే 'రాజ్యాంగయంత్రం' ఎందుకు బయలుదేరింది? సమాజంలో యీ వర్గాలు లేనపుడు 'రాజ్యాంగయంత్రం' ఎందువల్ల వుండేది గాదు? మనం యీ విధంగా ప్రశ్నించుకొంటేనే

రాజ్యాంగయంత్రం యొక్క అర్థమూ, పర్యవసానమూ, మనకు సరిగా బోధపడతాయి.

ఒక వర్గం మీాద మరొక వర్గం అధికారం చెలాయించ డానికి తోడ్పడే సాధనమే 'రాజ్యాంగయంత్రం'. బానిస యుగానికి పూర్వం సమాజంలో వర్గభేదాలుండేవి కావు. ప్రజలంతా సమాన ప్రతిపత్తితో జీవితయాత్ర సాగిస్తూండే వాళ్లు. మానవ శ్రమయొక్క ఉత్పత్తి శక్తి చాలా తక్కువ గానే వుంటూండడంవల్ల, ఆదిమయుగ మానవుడు కేవలం తన ఉదరపోషణకు మాత్రమే సరిపడు వస్తువులకే దినమంతా పాటుపడవలసి వుండేది. అట్టి స్థితిలో, మిగతా సమాజా న్నంతా పాలించి, ఆధిక్యత వహించుటకు కొందరు వ్యక్తులు బయలుదేరలేదు; ఆ పరిస్థితుల్లో అట్లాంటి ప్రత్యేక వర్గం బయలుదేరడమూ అసంభవమే. క్రమంగా మోటు పరికరా లతో వ్యవసాయ పరిశ్రమ చేయ నారంభించేరు, మానవులు. ఈ దశలోనే ఒక మానవుడు తన శ్రమ శక్తివల్ల తన జీవిత భృతి గడవగా మరికొంత అదనపు సరకు నుత్పత్తి చేయ గలిగేవాడు. బానిసవిధానం బయలుదేరి బలపడిన దీపరి స్థితుల్లోనే. బానిసయొక్క శ్రమశక్తివల్ల అతని కనీస జీవన భృతికై సరిపడగా కొంత అదనపుసరకు మిగిలినప్పుడు ఆ సరకు బానిస యజమానికే భుక్తమైపోయింది. ఈ రీతిగా బానిసల శ్రమ శక్తిచే నుత్పత్తి చేయబడిన అదనపు సరకు

క్రమంగా పోగుపడుతూ వుండడంవల్ల బానిసప్రభువుల ఆర్థిక వ్యవస్థ దృఢపడుతూ వచ్చింది. ఈ వ్యవస్థ నింకా దృఢతరం, శాశ్వతం చేసుకొనేందుకే రాజ్యాంగయంత్ర మనేది అవసరం అయింది.

దీనివల్ల తేలిందేమిటి? బానిసయుగంలో రాజ్యాంగ యంత్రమంటే, బానిసలమీద అధికారం చెలాయించడానికి బానిస ప్రభువులకు నిరాఘాటమైన అధికారాన్నిచ్చే సాధన మని. ఆ యుగంలో సమాజమూ, రాజ్యాంగమూ కూడా చాల తక్కువ ప్రాముఖ్యతగలవి. ఇప్పటి ప్రభుత్వాల స్వాధీనంలో వున్నట్టి రాకపోక సాధనాలూ, సౌకర్యాలూ అప్పటికి ఊహకు కూడా అందనివే. ప్రస్తుతం పర్వతాలు, అరణ్యాలు, నదులు, సముద్రాలు కూడా మానవుడికి ఆటంకాలు కానే కావు. ఆ యుగంలో యివన్నీ మానవునికి అభేద్యాలు, దుస్తరాలు. (అందుచేతనే పూజనీయములుగా వుండేవి.) అప్పటి రాజ్యాంగాలు కూడ ఆ పరిస్థితులకు తగినట్లే చాలా సంకుచితమైన, సరిహద్దుల్లోనే యేర్పాటు చేసుకొనేవాళ్ళు. ప్రతీ రాజ్యాంగానికీ వుండే పాలనా సాధనాలు కూడా పరిమితంగానూ, బలహీనంగానూ వుండ డంచేత పాలితప్రదేశమూ, చేయవలసిన పనులూ తక్కువ గానే వుండేవి. ఒక వర్గం మరొక వర్గాన్ని బలపూర్వకంగా పీడించి, అణిచిపెట్టేందుకు సాధనంగానే వుండేది, అప్పటి

రాజ్యాంగం కూడా. సమాజంలోని అత్యధిక సంఖ్యాకులైన ప్రజల్ని యే కొద్దిమందియొక్కో లాభంకోసం పనిచేసేటట్లు చేయడం, స్థిరమైన బలప్రయోగ సాధనాలు లేనిదే యెల్లప్పుడూ సాగదు. సమాజంలో వర్గ విభేదములు లేనంతకాలమూ అటువంటి బలప్రయోగ సాధనాలు వుండనే వుండవు. ప్రతిచోటా వర్గములు బయలుదేరి, వర్గ స్పర్థలు బలపడి, హెచ్చు పెరుగుతూ రావడంతో, రాజ్యాంగయంత్ర మనే ప్రత్యేక సంస్థ అవసరమైంది. వివిధ దేశాల్లో యీ రాజ్యాంగ సంస్థయొక్క రూపాల్లో భేదం వుండేది. బానిస యుగంలో కూడా ఎక్కువ నాగరకత గలిగి, విజ్ఞానవంతములై అభివృద్ధి జెందిన గ్రీసు, రోము మొదలైన దేశాల్లో వివిధతరహాల రాజ్యాంగ విధానాలుండేవి. (గ్రీసు, రోముదేశాలు బానిసలచేతనే నిర్మించబడినాయి.) అప్పటికే ఏకచ్ఛత్రాధిపత్యానికీ, ప్రజాస్వామ్యానికీ (Monarchy-Republic), కులీనపాలనకీ, ప్రజాతంత్రానికీ (Aristocracy-Democracy) భేదా లుద్భవించేయి. ఒక్క వ్యక్తియొక్క అధికారం 'ఏకచ్ఛత్రాధిపత్యం' అధికారులందరూ ప్రజలచే యెన్నుకోబడే పద్ధతి 'ప్రజాస్వామ్యం'. కొద్దిమంది ప్రభువంశీకుల పాలనమే 'కులీనపాలనము'. ప్రజలయొక్క అధికారమే 'ప్రజాతంత్రం'. (గ్రీకు భాషలో 'డెమోక్రసీ' యనే మాటకు ప్రజల అధికారమని అర్థము). రాజ్యాంగ

రూపాల్లో యీ సూక్ష్మభేదాలు అప్పటికే ఉద్భవించినాయి. ఏదెట్లా వున్నా బానిసయుగంలో ఏకచ్ఛత్రాధిపత్యమైనా కులీనపాలనమైనా, ప్రజాతంత్రమైనా, ప్రజాస్వామ్యమైనా, బానిసలను కలిగే వుంటూండేది.

ప్రాచీనకాలంలో యేకచ్ఛత్రాధిపత్యాలకూ, ప్రజాస్వామికాలకూ పోరాటాలు జరుగుతూండేవని మనం ప్రాచీన చరిత్ర గ్రంథాల్లో చదువుతూంటాము. కాని ద్వివిధ రాజ్యాంగాల్లోనూ బానిసలు మాత్రం ప్రజలుగా పరిగణించ బడేవాళ్లు కారు. పౌరులుగా పరిగణించ బడడంమాట అట్లా వుంచినా బానిసలు ఏ కాలంలో మానవ వ్యక్తులుగానైనా లెక్కించబడేవాళ్ళు గారు. రోమకుల చట్టాల్లో బానిసలు వస్తువులక్రిందే భావించబడ్డారు. ఇతర చట్టాలమాట అట్లా వుంచినా హత్యల్ని గూర్చిన చటాలు గూడా బానిసల విషయమై వర్తించవు! మానవులుగానూ, పౌరులుగానూ పూర్తి హక్కులు గలిగియుండే బానిస యజమానులకే యీ చట్టాలు వర్తించేవి. ఏకచ్ఛత్రాధిపత్యంగానీ, ప్రజాస్వామ్యంగానీ, ఆ రాజ్యాంగాల్లో బానిసలు వుండేవాళ్ళు; వాళ్ళ కెట్లాంటి హక్కులూ వుండేవిగావు; బానిస ప్రభువులకే అన్ని హక్కులూ వుండేవి. బానిసలపై యెట్టి అత్యాచారమైనా జరిగితే ఫిర్యాదు లేదు. చివరకు బానిసను హత్యచేసినా అది నేరముగా పరిగణించ బడేదిగాదు. బానిస

యుగపు ప్రజాస్వామ్యాలు ఆంతరంగిక నిర్మాణంలో కొంత కొంత భేదం గలిగి వుండేవి. కులీన ప్రజాస్వామ్యాలు, ప్రజా తంత్రి ప్రజాస్వామ్యాలు, యివి రెండు తరహాలు. కులీన ప్రజా స్వామ్యాల్లో, కేవలం రాజకుటుంబాలకు చెందిన అత్యల్ప సంఖ్యాకుల్లే ప్రత్యేకంగా పాల్గొంటూండేవాళ్లు. ప్రజాతంత్ర ప్రజాస్వామ్యాల్లో ప్రజలంతా, అంటే బానిస యజమానులందరూ (ఒక్క బానిసలు మినహా) పాల్గొన వచ్చును. రాజ్యాంగయంత్ర సమస్యపైనా, యింకా యితర విషయాలపైనా యీ ముఖ్య విషయాన్ని జ్ఞప్తియం దుంచుకొంటే సరియైన నిర్ణయాలకు రాగలుగుతాము.

ఒక వర్గం యింకో వర్గాన్ని అణిచిపెట్టి, పరిపాలిస్తూ శాశ్వతంగా లొంగుబాటులో వుంచడానికి తోడ్పడే సాధనమే 'రాజ్యాంగయంత్రము' ఏకచ్ఛత్రాధిపత్యమూ, కులీన ప్రజాస్వామికం, ప్రజాతంత్రం, యిటాగే బానిస రాజ్యాం గాల్లో కూడా యెన్నెన్ని తరహాలున్నా సారాంశం మాత్రం ఒకటే; బానిస కెట్టిహక్కులూ లేవు; వాళ్ళు మనుష్యుల్లో లెక్కగాదు. వాళ్ళు నిరంతరం పీడించబడుతూ వుండేవాళ్లు. జమీందారీ యుగంలోని రాజ్యాంగాల్లో కూడా మనం యీ విషయాన్నే చూస్తాము.

బానిస యుగంలోని రాజ్యాంగమే కొద్దిమార్పులతో జమీందారీ యుగంలోని రాజ్యాంగంగా మారింది. ఈ

మార్పుకు కారణం, దోపిడీచేసే విధానంలో కలిగినమార్పే. దీనికి ఎంతో ప్రాముఖ్యత వుంది. బానిస సమాజంలో బానిసల కెట్టిహక్కులూ లేవు; వాళ్ళు అసలు మనుష్యులే గారు. జమీందారీ యుగంలో 'దాసుడు' భూమికి అనుబంధింపబడి వుండేవాడు. జమీందారీ యుగపు చట్టాలు కూడా 'దాసులు' భూమికే మాత్రమే బంధించబడి యుండాలని నిర్ణయించేయి. ఆ కాలంలో ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు 'దాసులే'. పట్టణాలు చాల కొద్దిగా మాత్రమే వుండేవి. భూస్వామి లేక జమీందారు తన కిచ్చిన చిన్న భూఖండంమీద తన భృతికోసం నిర్దిష్టంగా కొన్ని దినాలు మాత్రమే పనిచేసుకొంటూ, మిగిలిన కాలమంతా 'దాసుడు' భూస్వామికొరకై పనిచేయవలసి వుండేది. ఈ విధానమును బలపరచేదిగానే అప్పటి చట్టం నిర్మించబడింది. వర్గ సమాజం యొక్క పర్యవసానం, ఒక వర్గాన్ని యింకో వర్గం దోపిడీ చేసి, అణచియుంచడం, అల్లే వుండిపోయింది. అంటే సమాజం వర్గపీడనమీద ఆధారపడే నడుస్తూండేది. కేవలం భూస్వాములకు మాత్రమే పూర్తిహక్కు లుండేవి. దాసుల కెట్టి హక్కులూ లేవు. యథార్థానికి బానిసల స్థితికీ, దాసుల స్థితికీ భేదం అంతగా లేదు. కాని, దాసుల దాస్యవిమోచన మార్గం కొంతవరకు సుగమం అయింది. ఎందుచేతనంటే, దాసుడు, జమీందారుయొక్క ఆస్తిగా యెంచబడేవాడు

గాదు. తనకాలాన్ని, శ్రమనీ కొంతవరకైనా తనకోసం వినియోగించుకొనేందుకు, దాసులకు అవకాశం యేర్పడింది. దాసుడు కొంతవరకైనా తన సొత్తు కాగలిగేడు. వర్తక సంబంధాలు, మారక సౌకర్యాలు అభివృద్ధి చెందుతూ రావడంతో జమీందారీవిధానం క్రమ క్రమంగా బ్రద్దలై పోజొచ్చింది. దాసులకు విముక్తి మార్గాలు ఎక్కువగా జొచ్చినాయి. బానిస సమాజంలోకంటె జమీందారీ సమాజంలో సామాజిక సంబంధాలు మరీ చిక్కులుగా వుండేవి. వర్తకము, పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందుతూ, పెట్టుబడిదారీ విధానానికి దారి తీస్తూండేవి. జమీందారీ విధానం విజృంభించియుండే మధ్యమ యుగంలో కూడా రాజ్యాంగ యంత్రం వివిధరూపాలు ధరించే వుండేది. ఒక్క భూస్వామి మాత్రమే పాలకుడుగా గుర్తించబడినా, వివిధ రాజ్యాంగ విధానాల్లో భేదాలంత పరిస్ఫుటంగా లేకపోయినా, అప్పుడు కూడా ఏకచ్ఛత్రాధిపత్యమూ, ప్రజాస్వామ్యమూ మొదలైనవి వుండేవి. దాసులకెట్టి రాజకీయ హక్కులూ వుండేవి గాదు.

బానిస విధానంలోనూ, జమీందారీ విధానంలోనూ కూడా అత్యల్పసంఖ్యాకు లత్యధిక సంఖ్యాకులమీద పరిపాలన సాగించుట పశుబల ప్రయోగం లేనిదే సాగలేదు. ఆ కాలంనాటి చరిత్ర అంతా కూడా పీడితులు పీడించేవాళ్ళ

అధికారాన్ని కూలద్రోయడం కోసం చేసే నిరంతర ప్రయత్నాలతో, తిరుగుబాట్లతో నిండివుంది. బానిసత్వ చరిత్ర బానిసలు చేసిన తిరుగుబాట్లూ, యుద్ధాలతో నిండివుంది. ఈ సందర్భంలో ప్రస్తుతం జర్మన్ కమ్యూనిస్టులు స్థాపించుకున్న 'స్పార్టాసిస్ట్' సంస్థను చూడండి. (జర్మనీలో పెట్టుబడిదారీ విధానాన్ని నాశనం చేసేటందుకు పోరాడుతూన్న పార్టీ యిదొక్కటే). జర్మన్లు యీ పేరెందుకు పెట్టుకున్నారు? 'స్పార్టాకస్' పేరిట యీ సంఘాన్ని యేర్పాటు చేసుకున్నారు. సుమారు రెండువేల సంవత్సరాల క్రిందట జరిగిన బ్రహ్మాండమైన బానిస తిరుగుబాటులో యితడొక నాయకుడు అసంఖ్యాకులైన బానిసలందరూ సాయుధులై స్పార్టాకస్ నాయకత్వం క్రింద మహా బలవత్తరమైన రోమక సామ్రాజ్యాన్ని ఎదిరించి, సంవత్సరాల పర్యంతమూ పోరాటం సల్పేరు. చివరకి వాళ్ళంతా ఓడిపోయి, పట్టుబడి బానిస యజమానుల దురంత దౌర్జన్యాలకు గురియైపోయేరు. వర్గ సమాజంయొక్క చరిత్ర ప్రతీకాలంలోనూ యిట్లాంటి తిరుగుబాట్లు మనకు కనిపిస్తూనే వుంటాయి. స్పార్టాకస్ గాధ కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. జమీందారీ యుగం కూడా యీ విధంగానే దాసులయొక్క నిరంతర పోరాటాలతో నిండివుంది. ఒక్క ఉదాహరణ చూడండి. మధ్య యుగంలో జర్మనీలో జమీందార్లకూ, రైతులకూ

పోరాటాలు పెచ్చు పెరిగి, యీ రెండు వర్గాలకూ మధ్య ప్రబహ్మాండమైన అంతర్యుద్ధంగా పరిణమించింది. రష్యాలో జమీందారీ భూస్వాములపై దాసులు సాగించిన తిరుగు బాట్లని గురించి మీకు తెలిసేవుంది.

వాళ్ళ అధికారాన్ని నిలబెట్టుకోనడానికీ, పరిపాలనను సాగించడానికీ, భూస్వాములు తమ చేతుల్లో ఒక అధికార యంత్రాన్ని వుంచుకుంటారు. దీనివల్ల అధిక సంఖ్యాకులు సంఘీభావంతో కొన్ని నియమాలకూ, చట్టాలకూ లోబడి వుంటూ, పాలక వర్గంయొక్క ప్రయోజనాల్ని కాపాడు తూంటారు. ఈ రాజ్యాంగ యంత్రానికి పర్యవసానం యేమిటి ? భూస్వాములకు దాసులమీద వుండే అధికారాన్ని నిలబెట్టుకోవడమే జమీందారీ విధానం వేరు వేరు రూపాల్లో యింకా ప్రబలంగావున్న ఆసియాలోని దేశా ల్లోనూ, రష్యాలోనూ యీ జమీందారీ రాజ్యాంగయంత్రం వివిధరూపాల్ని దాల్చి, అధికారం చెలాయిస్తూంది. ఏక చ్ఛత్రాధిపత్యంగా వుంటే ఒక్కనియొక్క ప్రభుత్వాన్నే గుర్తించవలసి వచ్చేది; ప్రజాస్వామ్యం అయితే భూస్వామి వర్గంలోనుంచి యెన్నుకోబడిన కొద్దిమంది ప్రతినిధుల అధి కారాన్ని ప్రజలు అంగీకరించవలసి వచ్చేది. అత్యధిక సంఖ్యాకులైన రైతులు, దాసులు, అతిస్వల్ప సంఖ్యాకులైన భూస్వాములకూ, జమీందార్లకూ లోబడి యుండేటట్లుగా

విభజించబడిన సమాజమే జమీందారీ సమాజము.

వాణిజ్యము, సరకుల మారకము, వీనిలో కలిగిన యభివృద్ధివలన పెట్టుబడిదారీ వర్గం అనే నూతనవర్గం జన్మించింది. మధ్య యుగం యొక్క కడపటిదశలో అమెరికా కనిపెట్టబడి, ప్రపంచ వాణిజ్యం హెచ్చు పెరిగిపోయింది. వెండి బంగారము లెక్కువగా త్రవ్వి తీయబడుతూ, యివే సరకుల మారకంలో సాధనములైనాయి. అపరిమిత ధన ప్రచారంవల్ల బ్రహ్మాండమైన ధనసంపదలు ఒక్క వ్యక్తి వద్దనే కూడబెట్టుటకు వీలు కలిగింది. ఈ స్థితిలోనే 'పెట్టుబడి' అనేది ఉదయించింది. ప్రపంచమంతటా వెండి బంగారములే సంపదగా గుర్తించబడినాయి. భూస్వామ్య వర్గంయొక్క ఆర్థికబలం క్షీణించుతూ, మరో నూతనవర్గం యొక్క, పెట్టుబడిదారీ వర్గంయొక్క బలం అభివృద్ధి కానాగింది. సమాజమంతా నూతనపద్ధతులపై పునర్నిర్మాణ మవుతూ, ప్రతి మానవవ్యక్తి సమానుడే యనే భావం బలపడజొచ్చింది. అదివరకటి సమాజాల్లోని బానిసలు, బానిస యజమానులు, దాసులు, భూస్వాములు, అనే విభాగాలు అదృశ్యమై, చట్టముల దృష్టిలో ప్రజలందరూ సమానులై పోయేరు. ఒకొక్కని కెంతంత పెట్టుబడి యున్నా, ప్రత్యేకాస్తిగా ఒకొక్కని చేతులో యెంత భూమి వున్నా, లేక కూలిపని చేసుకొనేందుకు రెక్కలు

మినహాగా మరేమీ లేని నిరుపేద అయినా, న్యాయచట్టం ముందు మానవులంతా సమానులే! చట్టం అందర్నీ సమానంగానే రక్షిస్తూంటుంది; ఆస్తి పాస్తులేమీ లేని ప్రజా సామాన్యాన్నుంచీ, జీవనోపాధికై తమ శ్రమశక్తి గాక మరేమీ లేని శ్రామికవర్గాలనుంచీ, ఆస్తుల్ని ఆస్తిపరులకోసం సంరక్షిస్తూంటుంది. ఇదే పెట్టుబడిదారీ సమాజం.

దీన్ని గురించి వివరంగా చెప్పడానికిప్పుడవకాశం లేదు. మన పార్టీ ప్రోగ్రామును గురించి చర్చించేటప్పుడు యీ విషయం మళ్లీ వస్తుంది. అప్పుడు పెట్టుబడిదారీ సమాజంయొక్క స్వభావ లక్షణాల్ని మీరు వివరంగా తెలుసుకోగలరు. వెనుకటి జమీందారీ సమాజ విధానంమీదికి 'స్వాతంత్ర్యం' అనే హెచ్చరికతో యీ నూతన పెట్టుబడిదారీ వర్గం తిరగబడింది. కాని, ఆ 'స్వాతంత్ర్యం' ఎవరికి? ఒక్క ఆస్తిపరులకే! పద్ధెనిమిదో శతాబ్దపు చివర భాగంలోనూ, పంథొమ్మిదో శతాబ్దపు మొదటిభాగంలోనూ జమీందారీ విధానం భగ్నమై పోయింది. ఒక్క రష్యాలో మాత్రం యితర యూరపియన్ దేశాల్లో కంటె ఆలస్యంగా, అంటే 1861 లో జమీందారీ విధానం కూలిపోయింది. అప్పుడే జమీందారీ రాజ్యాంగం స్థానే పెట్టుబడిదారీ రాజ్యాంగం యేర్పడింది. ఈ పెట్టుబడిదారీ రాజ్యాంగం తానొక వర్గానికి చెందినది గాననీ, ప్రజలందరికీ స్వాతంత్ర్య

మివ్వడమే తన పరమావధియని పళ్రిగల్భాలు చెపుతూంది. ఇక్కడకు వచ్చేటప్పటికి ప్రజలందరికీ స్వాతంత్ర్యం కలగ చేయాలని పోరాడే సోషలిస్టులకూ, పెట్టుబడిదారీ రాజ్యాంగ యంత్రానికీ పోరాటం బయలుదేరింది. ఇది ప్రపంచ మంతటా వ్యాపించింది. దీనికి పర్యవసానంగా సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ స్థాపించబడింది.

పెట్టుబడిదారీ విధానంతో చేయబడుతూన్న యీ విశ్వవ్యాప్తమైన పోరాటాన్ని అర్థం చేసుకోవాలంటే, పెట్టుబడిదారీ రాజ్యాంగం యొక్క సారాంశం గ్రహించాలంటే, అంతకు పూర్వం జమీందారీ విధానం మీదకు తిరుగుబాటు సాగించినప్పుడు పెట్టుబడిదారీ వర్గం కూడా 'స్వాతంత్ర్యం' అనే హెచ్చరికనే యిచ్చిందని మీరు జ్ఞాపకం వుంచుకోవాలి. జమీందారీ విధానాన్ని నిర్మూలించడం అంటే పెట్టుబడిదారీ వర్గానికి స్వాతంత్ర్యం కలిగించడమనే అర్థం. దీనివల్ల రైతులకు కూడా కొంతవరకు మేలే కలిగింది. అంతవరకూ తాము సేద్యం చేసుకుంటూన్న భూమినే జమీందారీ భూస్వాముల వద్దనుంచి కొనుక్కొని, వానిపై పూర్తి హక్కుదారు డగుట కవకాశం కలిగింది. అందుకు ప్రతిఫలంగా భూస్వామి కివ్వవలసిన ధనాన్ని వాయిదాలమీద గాని, క్విట్-రెంట్ పద్ధతిమీద గాని తీర్చ వచ్చును. ఈ రాజ్యాంగయంత్రం కూడా ప్రత్యేకాస్తి

విధానం మీాఁద ఆధారపడినదే గాన భూస్వాములకు ఏదో విధంగా ప్రతి ఫలం యిచ్చేటట్లు చేసి తీరుతుంది. ప్రత్యే కాస్తు లెట్లా బయలుదేరనీ, యీా బూర్జువా రాజ్యాంగం వాటిని కాపాడియే తీరుతుంది. ఈ విధంగా ఆధునిక నాగరక రాజ్యాంగా లన్నిట్లోనూ రైతులు ప్రత్యేకాస్తులకు యజమానులయేరు. రాజ్యాంగయంత్రం ప్రత్యేకాస్తుల్ని రక్షించేది గనక ఎక్కడైనా భూస్వామి తన భూమిలో కొంత భాగాన్ని రైతుల కిచ్చినప్పుడు, రాజ్యాంగయంత్రం దానికి ప్రతి ఫలంగా కొంత డబ్బును యిప్పించేది. అంటే, రాజ్యాంగ యంత్రం ప్రత్యేకాస్తి విధానాన్ని బలపరుస్తూ, దాని కన్ని విధాలా సహాయాన్నీ, ప్రోత్సాహాన్నీ యిస్తూందన్నమాట. ప్రతివర్తకునికీ, పారిశ్రామికునికీ, ఫ్యాక్టరీ యజమానికీ గల ప్రత్యేకాస్తి హక్కును రాజ్యాంగయంత్రం గుర్తించి, కాపాడుతుందన్నమాట. ప్రత్యే కాస్తులమీాద ఆధారపడి వున్న యీా సమాజం; పెట్టుబడి విధానంమీాద నిలువబడి యున్న యీా సమాజం; ఏ ఆస్తి పాస్తులూ లేక రెక్కల కష్టంమీాదనే జీవయాత్ర గడపు కార్మిక కర్షకులను అణచి యుంచడం మీాదనే ఆధారపడి యున్న యీా బూర్జువా సమాజం; తాను స్వాతంత్ర్యం మీాదే ఆధారపడి పరిపాలనను సాగిస్తూన్నానని చాటుకొంటూంది. జమీాందారీ చట్టాలకు విరుద్ధంగా పోరాడుతూ, 'ఆస్తి' అనేది స్వేచ్ఛగా

క్రూరాలైన రాజ్యాంగయంత్రం యే ఒక్క వర్గానికీ చెంది నదిగా కనిపించటం లేదనే సర్వత్రా చాటుకుంటూంది.

పరిపీడితులైన కార్మిక కర్షకులు పైకి స్వతంత్రం అనుభవిస్తున్నారు. కానీ, పెట్టుబడిదారీ యుగంలో కూడా రాజ్యాంగయంత్రం వీళ్ళని అణచిపెట్టడానికే వుపయోగించబడుతూంది. సార్వజనికమైన వోటింగు హక్కు యిచ్చామని ప్రకటిస్తుంది; బూర్జువా తత్వవేత్తలు, ఆర్థిక నిపుణులూ, రాజకీయ సిద్ధాంతవేత్తలూ మొదలైన వాళ్ళందరిచేతా యిది వర్గపాలన గాదని ప్రచారం చేయిస్తుంది. ఇది కేవలం పరిహాసాస్పదమై పోతూంది, యిప్పుడు. సోవియట్ రిపబ్లిక్ పెట్టుబడిదారీ రాజ్యాంగాలతో పోరాటం సాగిస్తూన్న యీ రోజుల్లో కూడా, యీ బూర్జువాలు మనల్ని స్వాతంత్ర్య విచ్ఛేదకులమనీ, కేవలం పశుబలం మీదే ఆధారపడివున్న రాజ్యాంగాన్ని నిర్మించేమనీ, కొందరు మరికొందర్ని బలవంతంగా అణచిపెట్టడం మీదనే మన రాజ్యాంగం ఆధారపడి వుందనీ నిందిస్తూ, తమది ప్రజా సమ్మతమైన ప్రజాతంత్ర రాజ్యాంగమనీ, బడాయి కొట్టుకుంటున్నారు. ప్రపంచమంతటా సోషలిస్టు విప్లవం ప్రారంభమయింది. కొన్ని దేశాల్లో విప్లవం జయాన్ని పొందిన ఈ తరుణంలో ప్రపంచ వ్యాప్తమైన పెట్టుబడిదారీ విధానంతో పోరాటం తీవ్రతరం అవుతూంది. అందుచేత యిప్పుడు

తూన్నా పెట్టుబడిదార్లే అధికారాన్నంతనీ హస్తగతం చేసు కొని, తమ యిష్టాన్ని నెరవేర్చుకుంటూంటారు. పర్యవసానంలో, అంటే ఎలక్షన్లు వున్నా, ప్రజాతంత్రమైనా మరేది వున్నా అధికారం మాత్రం పెట్టుబడిదే. విధానం యెక్కువ ప్రజాతంత్రయుతమైన కొద్దీ పెట్టుబడియొక్క పరిపాలన మరింత ద్వేషయుతంగానూ, అనాగరకంగానూ వుంటుంది. ఉదాహరణకు అమెరికా తీసుకుందము. ప్రపంచంలో అన్ని దేశాల్లో కంటేనూ అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వం యెక్కువ ప్రజాతంత్రయుతమైనది. ఇది నిర్వివాదాంశం. అందుచేతనే, కొద్దిమంది కోటీశ్వరులు మిగిలిన సమాజం అంతటిమీదా ప్రత్యక్షంగా, యెక్కువ క్రూరత్వంతో అధికారం చెలాయిస్తూండడం మనకు యిక్కడ స్పష్టంగా కనిపిస్తుంది. (1905 సంవత్సరం తర్వాత యీ విషయం మరింత విస్పష్టంగా ప్రతివానికీ తెలుస్తూంది.) 'పెట్టుబడి' అనేది జన్మించిందీ అంటే చాలు. అది సమాజం మీద అధికారం చెలాయించి తీరిందన్నమాటే. ఏ ప్రజాతంత్ర విధానంగాని, ఎన్నికల చట్టాలు గాని, యీ విధిని తప్పించ లేవు.

జమీందారీ విధానంతో పోల్చి చూస్తే ప్రజాతంత్ర ప్రజాస్వామ్యం యెంతో అభివృద్ధినే సూచిస్తుంది. శ్రామిక వర్గం ఐక్యతనీ, బలాన్నీ సంపాదించుకుని, సుశిక్షణ గలిగిన

యంత్రమంటే ఏమిటి? ఏదో బాతాకాని బట్టి మన అభిప్రాయాన్ని స్థిరపరచుకో కూడదు. రాజ్యాంగమంటే యేమిటో, ఈ నిందలపట్ల మన వైఖరి యేమిటో, వీటన్నిటి మీదా చక్కగా విమర్శించుకొని, ఒక నిశ్చితాభిప్రాయానికి రావాలి. రాజ్యాంగయంత్రాన్ని సమర్థించే బోధనలన్నీ మన ముందున్నాయి. వాట్ల నన్నిటినీ సవిమర్శంగా చూడ వలసి వుంటుంది.

ఏంగిల్సు వ్రాసిన Origin of Family Private Property and State అనే పుస్తకంలో యీ విషయంలో స్పష్టంగా యిట్లా వ్రాయబడి వుంది: "భూమియందు, యితర ఉత్పత్తి సాధనాలయందు ప్రత్యేక వ్యక్తులస్వత్వాన్ని సమర్థించే రాజ్యాంగం, పెట్టుబడికే ప్రాధాన్యత యిచ్చే రాజ్యాంగం ఎంత ప్రజాతంత్రయుతంగా వున్నా సరే, పెట్టు బడిదారీ రాజ్యాంగమే అవుతుంది. అట్లాంటి రాజ్యాంగ యంత్రం, కేవలమూ కార్మికవర్గాన్నీ, బీదరైతుల్నీ అణచి యుంచే సాధనంగా మాత్రమే వుంటుంది. సార్వజనికమైన వోటింగు పద్ధతి, ప్రజా ప్రతినిధి పరిషత్తు, పార్లమెంటు, యివన్నీ (దోపిడీవిధానంలో) రూపభేదాలు మాత్రమే. కాని, అసలు మూలపదార్థాన్ని మాత్రం మార్చవు."

రాజ్యాంగయంత్రం అనేక రూపాల్లో పరిపాలనను సాగించవచ్చు. ఏ రూపంలో రాజ్యాంగయంత్రం సాగు

ప్రచురించని బూర్జువా పత్రిక ఒకటీ లేనేలేదు. కాని, మన మెన్షివిక్కులూ, సోషల్ రివల్యూషనరీలూ కూడా ఎంతో సరళత్వంతో (?) బోల్షివిక్కులపై మోపబడుతూన్న ఈ నిందను తామే కనిపెట్టి విసిరినవాళ్ళమని తలచి, సంతృప్తి పడుతూన్నారు. అట్లా తలుస్తూంటే వాళ్లు పాపం! పప్పులో అడుగేసేరన్నమాటే.

ఈ రోజుల్లో అతి ధనవంతములైన దేశాలన్నింటిలోనూ యెంతో ధనవ్యయం చేసి పత్రికల్ని నడుపుతూన్నారు. కోట్లకొద్ది రూపాయలు వెచ్చించి ప్రతిదినమూ కోట్లగొద్ది పత్రికలు ప్రకటించి, బూర్జువాలు తమ కుటిల నీతులూ, అబద్ధాలూ వ్యాపింప చేస్తూన్నారు. అవన్నీ కూడా బోల్షివిజాన్ని, సోవియట్లన్నీ తిట్టి, ఎన్నో అభూత కల్పనల్ని ప్రచారంలోకి తెస్తున్నాయి. అమెరికా, ఇంగ్లాండు, స్విట్జర్లాండు మొదలైనవన్నీ ప్రజాతంత్రం గల రాజ్యాంగాలనీ, బోల్షివిక్ రిపబ్లిక్ ఒక బందిపోటు ప్రభుత్వమనీ, స్వేచ్ఛ అనేది అచ్చట లేనే లేదనీ, ప్రజాధికారాన్ని నాశనం చేసిన వాళ్ళు బోల్షివిక్కులేయనీ, 'ప్రజా ప్రతినిధి పరిషత్తు' (Constituent Assembly) ను కూడా తొలగించి పారేశారనీ, యింకా యెన్నో అబద్ధాల్ని, అభూతకల్పనల్ని యీ పత్రికలన్నీ వెదజల్లుతూన్నాయి. వీళ్ళ నిందలే మనల్ని ముఖ్య సమస్యకు దగ్గరగా తీసుకొని పోతాయి. రాజ్యాంగ

రాజ్యాంగయంత్ర సమస్య కెంతో ప్రాముఖ్యతవుంది. అంతే కాదు. యీ సమస్య యిప్పుడే పరిష్కరించబడవలసి వుంది. అన్ని రాజకీయ సమస్యలకూ, వర్తమాన రాజకీయ పోరాటాలకూ ఈ సమస్య కేంద్రమై వుంది.

రష్యాలో గాని, యే యితర దేశంలోగాని పరిశీలించి చూస్తే, చాలావరకు రాజకీయ వివాదాలు, విభేదాలు, పోరాటాలు, యివన్నీ రాజ్యాంగయంత్రం ఏమిటి? అనే దానిమీదనే బయలుదేరినా యని తెలుసుకోగలము. పెట్టుబడిదారీ దేశాల్లో, ప్రజాతంత్ర ప్రజాస్వామ్యాల్లో, చివరకి స్విట్జర్లాండు, అమెరికా దేశాల్లో కూడా రాజ్యాంగయంత్రం ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం వహిస్తూందా? సాధారణ ప్రజానిర్ణయానికి బద్ధమై వుంటూందా? జాతీయాభిప్రాయానికి విలువ వుందా? లేక, ఆ ప్రజాతంత్ర ప్రజాస్వామిక దేశాల్లో కూడా రాజ్యాంగయంత్రం కార్మిక కర్షకులమీద తమ అధికారాన్ని నిలబెట్టుకోనేటందుకు పెట్టుబడిదారుల చేతుల్లో ఒక సాధన మాత్రంగా ఉపయోగిస్తూందా? ఇదే ముఖ్యప్రశ్న. దీని మీదనే ప్రపంచంలో నేటి రాజకీయ పోరాటాలన్నీ కేంద్రీకరించ బడుతూన్నాయి. బూర్జువా పత్రికలన్నీ బోల్షివిజమ్‌ను తిట్టి దుమ్మెత్తిపోస్తూనే వున్నాయి. బోల్షివిక్కులు ప్రజాధికారాన్ని కూలద్రోసి, భగ్నం చేసేరనే నిందను అదే పనిగా పెద్ద పెద్ద అక్షరాలతో

దళాలుగా యేర్పడి, పెట్టుబడిదారీ విధానంతో నిరంతర పోరాటాన్ని సాగించేటందుకు యీ ప్రజాతంత్రం అవకాశం కలిగిస్తుంది. బానిస యుగంలో మాట అట్లా వుంచినా, చివరకి జమీందారీ యుగంలో కూడా దాసులకీ హక్కుల్లో శతాంశం కూడా లేవు. బానిసలు, దాసులూ తిరుగుబాట్లు చేసేరు; కుట్రలు పన్నేరు; అంతర్యుద్ధాలు సాగించేరు. కాని, యెప్పుడూ చైతన్యం కలిగిన అధిక సంఖ్యాకుల్ని తమతో చేర్చుకో లేకపోయేరు. పోరాటాల్ని నడిపించిన పార్టీలు, తమ ఆదర్శమేమిటో కూడా స్పష్టంగా తెలుసుకో లేక పోయేవి. చరిత్రలోని గొప్ప విప్లవఘట్టాల్లో వీళ్ళందరూ పాలకవర్గాల చేతుల్లో కీలుబొమ్మలుగానే వుండేవారు. ప్రపంచ వ్యాప్తమైన సామాజికాభివృద్ధిని బట్టి చూస్తే, బూర్జువా ప్రజాతంత్రము, పార్లమెంటు, అందరికీ వోటింగు హక్కులు, యివన్నీ గొప్ప అభివృద్ధినే సూచిస్తాయి. క్రమంగా మానవజాతి పెట్టుబడిదారీ విధానం వైపుకే నడిచింది. పట్టణాల్లోని నాగరకత ధర్మమా యని పీడించ బడుతూన్న శ్రామికవర్గానికి ఆత్మ చైతన్యావకాశంకలిగింది. ప్రపంచ మంతటా వ్యాపించిన కార్మిక వర్గోద్యమము, కోట్లకొలదీ కార్మికులు, కార్మిక పార్టీల నిర్మాణం, ప్రజా ...హాలయొక్క పోరాటాల్ని చైతన్యంతో నడుపు తూన్న సోషలిస్టుపార్టీలు, వీట్లన్నిటికీ పెట్టుబడిదారీ విధా

నమే 'జన్మభూమి' అయింది.

పార్లమెంటరీ విధానం లేకపోతే, ఎలక్షన్లు లేకపోతే కార్మిక వర్గంయొక్క అభివృద్ధి అసాధ్యమే అయి వుండేది. అందుచేతనే ప్రజా సామాన్యంలో దృష్టిలో వీటికెంత ప్రాముఖ్యత వుందని కూడా చెప్పవచ్చును. అందువల్లనే యీ విధానం మార్చాలి అంటే అందరికీ ఎంతో కష్టంగా కనిపిస్తుంది. విద్యాధికులు, మత ప్రచారకులు మొదలైన తెలిసిన మోసగాళ్లే గాకుండా ప్రజాసామాన్యమంతా బూర్జువాల అసత్యాల్ని బలపరుస్తూ, సమాజంతో రాజ్యాంగయంత్రానికి సంబంధం లేదనీ, అది ప్రజలందరి ప్రయోజనాల్ని రక్షించడానికే వుందని విశ్వసిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానాన్నుంచి సోషలిజమ్‌లోనికి సమాజం మార్పు జెందడాన్ని అర్థం చేసుకోలేక యీ ప్రజలంతా అమాయిక భయంతో యిట్లాంటి పరిణామాన్ని సందేహించుతున్నారు. బూర్జువా వర్గంమీద ఆధారపడి యున్నవాళ్లు, పెట్టుబడిరొక్క సంకెళ్లలో బడియున్నవాళ్లు, పెట్టుబడికి అమ్ముడు బోయినవాళ్ళు (ప్రొఫెసర్లు, కళానిపుణులు, మత గురువులు మొదలైనవాళ్లు) మాత్రమే గాక కేవలమూ బూర్జువా సిద్ధాంతాల్లోను, నమ్మకాల్లోనూ పడివున్న సామాన్య ప్రజలెందరో కూడా 'బూర్జువా స్వేచ్ఛ' యందున్న అభిమానంవల్ల బోల్షివిజమ్‌కు వ్యతిరేకులై

వుంటూన్నారు. సోవియట్ రిపబ్లిక్‌ను స్థాపించడం ద్వారా బూర్జువాల మిధ్యవాదాల్ని బహిరంగంగా సవాలుచేసి, త్రోసివేస్తూంది, బోల్షివిజమ్.- మీ రాజ్యాంగయంత్రం స్వేచ్ఛగల దంటూన్నారు. కాని, ప్రత్యేకాస్తి విధానం వున్నంతకాలమూ ఎంత ప్రజాతంత్రయుతంగా వున్నా అది నిజానికి కార్మిక కర్షకుల్ని అణిచి యుంచడానికి పెట్టుబడిదార్ల చేతుల్లో సాధనంగా మాత్రమే వుంటుంది. అట్లాంటి రాజ్యాంగయంత్రం, ఎంత స్వేచ్ఛాయుతమైన దైతే అంత యెక్కువగా యీ పీడనా విధానం స్పష్టంగా కనిపిస్తూంటుంది. ఉదాహరణకు స్విట్జర్లాండు, అమెరికా సంయుక్త రాష్ట్రాల్ని తీసుకోండి. అంత నిర్దాక్షిణ్యంగానూ, మానవ వినాశకరంగానూ దోపిడీచేసే పెట్టుబడిదారీ విధానాన్ని మరేదేశంలోనూ చూడము. అంతేగాదు. ఆదేశాల్లో యిది ప్రత్యక్షంగా, బహిరంగంగా కనిపిస్తుంది. పౌర సమానత్వమనీ, కార్మిక ప్రజాతంత్రమనీ పెద్ద కబుర్లు చెపుతూ ప్రజాతంత్ర ప్రజాస్వామ్యమని ఎంత కప్పిపుచ్చ జూచినా, యీ దేశాల్లోనే దోపిడీ విధానం మరింత స్పష్టంగా కనిపిస్తుంది.

యథార్థానికి స్విట్జర్లాండు, అమెరికాలలో పెట్టుబడిదే ప్రభుత్వమంతా. కార్మికులు తమ స్థితిని బాగుచేసు కొనేందుకు తీవ్రంగా ప్రయత్నించేరంటే వెంటనే అంతర్యుద్ధం

లోకి (Civil War) దిగుతుంది. ఈ దేశాల్లో సైన్యాలు ఎంతో తక్కువగా వుంటాయి. స్థిర సైన్యాలు మరీ పరిమితంగా వుంటాయి. స్విట్జర్లాండులో 'మిలిషియా' వుంది. ప్రతి వ్యక్తి యింటిదగ్గర రైఫిల్సు వుంచుకుంటాడు. ఇటీవలి వరకూ అమెరికాలో స్థిర సైన్యం లేనే లేదు. అందుచేత పెద్ద పెద్ద సమ్మెలు జరిగినప్పుడు బూర్జువాలే సాయుధులై, మండగేళ్ళకు డబ్బిచ్చి తెచ్చి, సమ్మెల్ని తీవ్రంగా అణిచి వేస్తారు. ప్రపంచంలో మరెక్కడా కూడా కార్మికోద్యమాన్ని అంత క్రౌర్యంతో అణచివేయడం చూడము. పెట్టుబడిదార్లకు, ఆ దేశాల పార్లమెంట్లలో వున్నంత పలుకుబడి మరే దేశంలోనూ వుండదు. ఆ దేశాల్లో 'స్టాక్-ఎక్స్ఛేంజి' దే సర్వాధికారమూ; పెట్టుబడి యొక్క శక్తికి యెదురు లేదు. పార్లమెంటూ, ఎలక్షన్లూ, యిది కేవలం క్రీడా వినోదాలు, కీలుబొమ్మలూ మాత్రమే.........కాని, కార్మికుల్లో బూర్జువా భ్రమలు తొలగిపోతూన్న కొలదీ సోవియట్ శక్తియొక్క పరిజ్ఞానం వ్యాపిస్తూంది. అందులోనూ రక్తప్లావితమైన యీమహాత్యాకాండ (ఐరోపా యుద్ధం) అయినప్పటినుంచీ మనం పెట్టుబడిదారులతో నిర్దాక్షిణ్యంగా పోరాడవలసి వుందనే విషయం కార్మిక వర్గానికి స్పష్టమై పోయింది.

ప్రజాస్వామ్య మనేది యే యే రూపాలు ధరించినా,

చివరకు ప్రజాతంత్ర ప్రజాస్వామ్యమైనా సరే, అది బూర్జువా ప్రజాస్వామ్యమే అయినట్లైతే కేవలమూ కొద్ది మంది పెట్టుబడిదార్లు ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల్ని అణిచిపెట్టే సాధనంగా మాత్రమే వుంటుంది. భూమి, ఫాక్టరీలు, యంత్రాగారాలు, రైల్వేలు మొదలైన వాట్లలో ప్రత్యేక హక్కు వున్నట్లైతే, సమాజాన్నంతా పెట్టుబడి విధానము కూలికి పనిచేయవలసిన స్థితిలోనే బంధించి వుంచినట్లైతే, అంటే మనపార్టీ బలపరచే సోవియట్ రాజ్యాంగ విధానాన్ని అమలులోనికి తీసుకురాకనే పోయినట్లైతే, ఎంత స్వేచ్ఛాయుతమైన దైనా, ప్రజాతంత్ర ప్రజాస్వామికమైనా, రాజ్యాంగయంత్రం వర్గపీడనా సాధనంగానే వుండక తీరదు.

ఈ రాజ్యాంగ యంత్రాన్ని శ్రామిక వర్గంయొక్క చేతుల్లోకి తెచ్చుకోవలసి వుంటుంది. 'సర్వసమానత్వం' అనే పాత అభిప్రాయాన్ని మన యీ విషయంలో దూరంగా వుంచాలి. దోపిడి విధానం యెంతవరకు నిలిచి వుంటుందో అంతవరకూ సర్వసమానత్వం అనేదే వుండదు. కూలి పనివాడు భూస్వామితోనూ, ఆకలిగొన్నవాడు కడుపునిండ కుడిచి కూర్చున్న వానితోనూ, ఎప్పుడూ సమానులు గాజాలరు. ప్రజలు రాజ్యాంగయంత్రాన్ని మూఢవిశ్వాసంతో గౌరవిస్తూ, దానినే ప్రజాశక్తికి చిహ్నంగా తలుస్తూ

న్నారు. ఇంక యీ బూటకం ఎంతోకాలం సాగదు. శ్రామిక వర్గం మేలుకొని, "ఇవన్నీ బూర్జువాలు చెప్పే మోసపుమాటలు. మేము యీ యంత్రాన్ని పెట్టుబడిదారుల దగ్గరనుంచి లాక్కున్నాము ఈ ఆయుధంతోటే, యీ యంత్రసాధనంతోటే, దోపిడీ విధానాన్ని నాశనం చేస్తాము. ప్రపంచంలో ఎక్కడా, ఎవ్వరూ, ఎవరినీ కూడా దోచుకోడం సాధ్యం కాకుండా అయినప్పుడు, భూస్వాములు పెట్టుబడిదారులూ,. ఫాక్టరీ యజమానులు మొదలైన దోపిడీగాళ్లు లేకుండా అయినప్పుడు, కొందరు తిండి మెక్కినై, మరి కొందరు తిండిలేక మాడిపోయి బాధ పడకుండా యేర్పాటు చేయ గలిగినప్పుడు, అంటే సమాజంలో యెటువంటి పీడనా విధానమూ లేకుండా చేయ గలిగినప్పుడే, మనం ఈ యంత్ర సాధనాన్ని, దూరంగా పెంటకుప్పమీద పారేస్తాము. అప్పుడు రాజ్యాంగ యంత్ర మనేది వుండనే వుండదు. దోపిడి అనేది అంతకన్నా వుండదు. ఇదే మన కమ్యూనిస్టు పార్టీయొక్క దృక్పథము, ఆదర్శము!

ముందు ముందు, మన వుపన్యాసాల్లో తిరిగీ యీ విషయానికి రాగలమని ఆశిస్తూ, యింతటితో నా ఉపన్యాసాన్ని ముగిస్తాను.

— స్టెక్లోవ్

11 జూన్ 1919

# పర్యాయ పదసూచిక.



అధికారము, శక్తి—Authority, Power

అదనపు—Surplus

ఆధ్యాత్మిక—Spiritual

ఆదర్శవాద—Idealistic

ఆదిమకాలపు—Primitive

ఉత్పత్తిశక్తి—Productivity

ఏకచ్ఛత్రాధిపత్యం—Monarchy

కూలిపని—Wage, Labour

కులీనపాలనము—Aristocracy

కార్మికవర్గము—Working Class

కేంద్రీకృతమైన—Concentrated

జమీందారీ విధానం—Feudalism

ధర్మశాస్త్రము—Jurisprudence

దృశ్య విషయం—Phenomenon

దాసత్వ పద్ధతి—Serfdom

పని, శ్రమ—Labour

పైతృక—Patriarchal

ప్రజాతంత్రం—Democracy

ప్రజాస్వామ్యం—Republic

ప్రమాణములు—Standards

ప్రభుత్వము—Government

భౌగోళిక—Geographical

భౌతిక శక్తి—Physical Force

బోల్షివిక్ }
మెన్షివిక్ } రష్యన్ సోషల్-డెమొక్రాటిక్ పార్టీలోని అతివాద-మితవాద వర్గాలు. సిద్ధాంత భేదాలమీద 1903 లో యేర్పడిన యీ చీలికలు స్థిరమై యీ వర్గాలే ఆయా పార్టీలకు సార్థకమై పోయేయి. వివరాలకు 'లెనిన్ ఉపదేశాలు' చూడండి.

రాజ్యాంగయంత్రం—State

రాకపోకలు—Communications

వర్తకపు సరుకు—Commodity

సాంకేతిక, పారిభాషిక—Technical

సోవియట్—ప్రజలచే యెన్నుకోనబడిన 'పంచాయితీ' వంటి సంఘము. ప్రతి ఫాక్టరీ, మిల్లు, కర్మాగారము, గ్రామము కూడా 'సోవియట్'ను కలిగివుంటాయి. వీట్లో ప్రతినిధులే జిల్లా రాష్ట్ర, అఖిల రష్యా సోవియట్ల ద్వారా పరిపాలనను సాగిస్తారు.

సోషలిస్టు రివల్యూషనరీ }
సోషల్ రివల్యూషనరీ } రెండూ ఒకటే. రష్యాలో, మార్క్సిస్టు పార్టీనని చెప్పుకుంటూ, చివరకు శ్రామిక వర్గానికే ద్రోహకరంగా ప్రవర్తించిన వివిధ రాజకీయ పార్టీలలో ఒకటి.